శ్రీ

తిరుమలాపుర

# రామచంద్రప్రభు శతకము

గ్రంథకర్త:

గోపాలుని పురుషోత్తమ మరియు సోమయాజి



(శ్రీ)

# తప్పొప్పుల పట్టిక.



| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 4 | 21 | సాన్నిధ్య | సాన్నిధ్యమం |
| 5 | 5 | భూమ్యాంతర | నామాంతర |
| 7 | 12 | నెంతే | నెంతో |
| 9 | 17 | రిపుపృథ్వీశులం | రిపుల్ భీతిల్లఁగాఁ |
| 10 | 15 | విజ్ఞుల్ | ప్రాజ్ఞుల్ |
| 12 | 17 | నేనే | నానే |
| 12 | 18 | రటనన్ | ర్భటనన్ |
| 20 | 19 | బవిత్రముగు | బవిత్రముగ |
| | | భావంబాదుఁ | భావింపంగఁ |



శ్రీ

# తిరుమలాపుర
# రామచంద్రప్రభు శతకము

కేశవశతక, మార్కండేయ, గోపీచందు,

సత్యహరిశ్చంద్ర, అభిజ్ఞానశాకుంతల,

కోటీశ్వరతారావళి, దుర్గాస్తోత్ర

దండకాద్యనేక

గ్రంథకర్త:

గోపాలుని పురుషోత్తమశర్మ పాకయాజి

విరచితము

ఓం

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# కృతిప్రశంస



సీ. శ్రీమించు హేలాపురీ మండలంబందుఁ
దిరుమలాపురమున నలరు నెవఁడు
కనుపర్తి వీరరాజునకు తనూజుఁడౌ
శ్రీనృసింహున కిష్టసిద్ధి యెవఁడు
సుబ్బరాయున కాత్మసూనుఁడౌ కృష్ణరా
యునకుఁ బ్రసన్నుఁడై మనుచు నెవఁడు
గురురాజసుతుల నిర్వుర, సుబ్బరాయ సం
జీవరాయుల నేలు శ్రీశుఁడెవఁడు

తే. గీ. అట్టి సుందరరామ విఖ్యాతనామ
మలరు దేవాదిదేవున కర్పణముగ
శతకవృత్తంబులఁ గృతి సల్పినాఁడ
మోక్షసామ్రాజ్య మొసఁగూర్ప మ్రొక్కువాఁడ.

గ్రంథకర్త



గ్రంథకర్త:

గోపాలుని పురుషోత్తమశర్మ పాకయాజి,

సత్యనారాయణపురం, బెజవాడ.



సంకర్త:

గోపాలుని పురుషోత్తమశర్మ పాకయాజి,

సత్యనారాయణపురం, బెజవాడ.

శ్రీ బాల సరస్వతి, ఆశుకవీంద్రసింహ, ఆశుకవి చక్రవర్తి,
కుండిన కవిహంస, కవిరత్న, అవధానిపంచానన, కవి కేసరి,
కల్పిత కథారచనాధురీణ, కవి భూషణ, ప్రౌఢ భారతి,
ఆశుకవి సమ్రాట్ప్రముఖ బిరుదాంకితులగు

బ్రహ్మశ్రీ

## కొప్పరపు సోదర కవులు శతావధానులు

రామచంద్రప్రభు శతకముపై నొసంగిన

# అభిప్రాయము.



కం. శ్రీరామచంద్రశతక మె
వారుం బఠియింప విన్న వారనిమోక్ష
శ్రీరమ్యకీర్తియుతులై
మీరెద రిష్టార్థసిద్ధి మేకొన నెపుడున్.

కం. నీతియొ, భక్తియొ తెల్పి, ధ
రాతలసువ్యాప్తి శతకరాజము లొప్పన్
నేత కవి యొసఁగఁ జాలెడు
ఖ్యాతిని మఱి యొం డొసంగఁగా జాలవుగా.

మ. కనుపర్త్యన్వయుఁడౌ నృసింహగుణి కాంక్షం దీర్పఁగన్ భక్తి
పెంపొనయన్ దిర్మలపూర్ణి కేతనునిపై నిక్ష్వాకుసద్వంశపా
వనుపై భక్తజనావనవ్రతునిపై వ్రాసెన్ బుధేంద్రుల్ హి
తాత్మను వీనిం బురుషోత్తమార్యునిఁ గళోత్సాహుం బ్రశం
సింపరే.

ఉ. భక్తి ప్రధాన మీ కృతికి, భక్తుఁ డితండు రచించె దీని నా
సక్తిని; దుర్విమర్శనము సల్పక నేర్పున నాలకించినన్
రక్తి ఘటిల్లుఁ; గాదనిన రా టలవారికిఁ గాక, గల్గ దీ
వ్యక్తికి సుంతయేని; భగవంతుఁడు భక్తులపాల నుండడే.

ఉ. కందనిభైకమూర్తివని కందములన్ శతకంబుఁ జేసి ని
న్నుం దనియించె వేంకయ యనూనమతిం దనతండ్రి యం
చు నీ వెందు సువృత్తభాషి వగు టెంచి సువృత్తములన్
భజించె బెంపొందెడు భక్తిఁ జూపి పురుషోత్తమయజ్వ
యితండు రాఘవా!



ఓం

శ్రీరస్తు శుభమస్తు

అవిఘ్నమస్తు

శ్రీ చిదానందసరస్వతీస్వామినే నమః

# శ్రీ రా మ చ ం ద్ర ప్ర భు శ త క ము.

శా. శ్రీవైకుంఠ మయోధ్య గాఁగ, సిరియే సీతామహాదేవి
గాఁ। గైవల్యప్రభుఁ డీవ రాఘవుఁడు గాఁగన్, శంఖచక్రం
బులే। సేవాసక్తులు కైకసూనులుగఁ దచ్ఛేషుండు సౌమి
త్రిగా। నావిర్భూతులుగారె తిర్మలపురీంద్రా! రామచంద్ర
ప్రభూ! ౧

శా. ప్రాఁబల్కుల్ మును సోమకాసురుఁడు సంద్రంబందు దా
పంగ దే। వా! బన్నంబును బాపు మంచు నజుఁ డార్వన్
వానికై మీనతన్। సేబాసంచనఁ బుట్టి, యయ్యసురునిన్
జెండాడి కాపాడితౌ।రా! బల్దిట్టవు తిర్మలాపురవరేంద్రా!
రామచంద్రప్రభూ! ౨

మ. దివిజుల్ దానవు లేకమై సుధకు నబ్ధిన్ ద్రచ్చఁగా నెంచి
భూ। ధ్రవిభున్ గవ్వముఁ జేసి మందర,మహీంద్రశ్రేష్ఠునిన్
శేషు రా। జ్జువుగాఁ జేసి మథింపఁ గ్రుంగినగిరిన్ జోద్యంబు
గా నెత్తఁ గూ। ర్మవినోదాకృతిఁ గొన్నతిర్మలపురీంద్రా!
రామచంద్రప్రభూ! 3

మ. దితిసంతానమునం దొకం డగు మదోద్రేకుండు హేమా
క్షుడీ కుతలం బాతయుఁ జాపజుట్టి జలధిన్ గూల్పంగ, భూ
దేవి నిన్నతిదీనత్వముఁ జెంది వేడఁ, గిటివై యాభూమి పై
కెత్తి తత్స్తుతి మెప్పొందిన తిర్మలాఖ్యనగరీశా! రామ ...౮

మ. మతిమంతుండును నీకృపాకలితుఁడౌ మాన్యుండు ప్రహ్లాదుఁ
డం చితభక్తి న్నినుఁ గొల్వఁ, గాదనుచుఁ దచ్చిత్తంబు గా
సిల్లఁ దుష్కర్మియై శిక్ష లొనర్చు నాశకు నృసింహత్వంబునం
జీల్చి యప్రతిమానప్రభఁ గన్న తిర్మలపురీంద్రా! రామ

మ. దనుజుండౌ బలి దానకంకణము చేతం బూని యీనున్న వాఁ
డని భూదేవకుమారమూర్తి వయి, మూఁ డడ్గుల్ ధరన్
గోరి కైకొని పాతాళముఁ జేరఁ ద్రొక్కి, యచటన్ గోర్కు
ల్గన్ దీర్చి తౌర, నయం బొప్పగ తిర్మలాపురవరేంద్రా!

మ. అవనిన్ క్షత్త్రియవంశనాశనముఁ జేయన్ గొడ్డలిన్ బట్టి య
య్యవనీపాలుర నెత్తుటం బితల హర్షాక్రాంతులన్ జేసి భూ
ధవదుర్మార్గము వెల్లడించి విజయోద్దండుండవై పొల్చు భా
ర్గవరామాఖ్యుఁడ వీవ తిర్మలపురీంద్రా! రామచంద్రప్రభూ! ౭

మ. మునియాగారిము తాటకన్ దునిమి, సమ్మోదంబుతో
శంభుదేవుని విల్లున్ దునియించి సీతఁ గొని మెప్పున్ జెంది
శూరాళి చేత, నరణ్యంబున కేగి పంక్తిగళునిన్ దండించి
సాకేతమున్ ఘనతన్ జేరిన తిర్మలాపురవరేంద్రా! రామ

మ. హలమున్ దాలిచి చెట్టలౌ నసురులన్ హర్షావిమోద్రంచి
దోర్బలమందితని సాటి లేర నెడు శుంభత్కీర్తి రాణించుచున్

బలభద్రుం డనునామధేయమున నెవ్వం డొప్పె నాతండ వీ
వలఘుస్వాంతుఁడ! తిర్మలాఖ్యనగరీంద్రా! రామచంద్రప్రభూ!

శా. శాక్తేయం బతినింద్య తంత్రములచే సాగించి దుష్కర్మలా
సక్తిం జేయఁగఁ జేసి యెల్లరకు హింసాప్రక్రియల్ నేర్పు త
చ్ఛాక్తేయాసురబుద్ధి భూతదయచే శాంతింపఁగాఁ జేసితో
రక్తిం బుద్ధుఁడవయ్యుఁ దిర్మలపురీంద్రా! రామచంద్రప్రభూ!

మ. పరభార్యారతు లార్తహంతకులు పాపప్రక్రియాచారత
స్కర గోహంతక కూటసాక్షుల నివాసంబైన భూభారమా
తురతన్ బాపుతలంపుతోఁ గలికివై తోషంబు జేకూర్తు వౌ
ర! రమానాయకవంద్య! తిర్మలపురీంద్రా! రామచంద్రప్రభూ!

మ. నరనారాయణు లంతకున్మునుపుగానన్ ద్వాపరంబందు సం
గరరంగంబున పార్థసారథివి గాఁగన్ గెల్చు కుంతీసుతుల్
వఱలంగగ్గిరి; ఫల్గునుం డెసఁగె నిభక్తుండు బంధుండుగా
హరముఖ్యామరవంద్య! తిర్మలపురీంద్రా! రామచంద్ర ౧౨

మ. సభలోఁ దాతయు మామయున్ మఱఁదులున్ సామంతు
లాచార్యులున్। విభులున్ జూడ సుయోధనుండు పగతోఁ
విఖ్యాతయౌ ద్రౌపదిన్। రభసం బొప్ప వివస్త్రఁ జేయు
నెడలన్ రక్షించి పేర్గొన్న నీ। ప్రభ యేమందును తిర్మలా
పురవరేంద్రా! రామచంద్రప్రభూ!

మ. గుహునిన్ గాచితి వంట తెప్ప నడుపన్ గూర్మిన్, వెసన్
గుబ్జపై। సహజంబౌ ననురాగ ముచితంబటం యాసక్తిన్ ఫలం
బిచ్చుటన్। బహుమానంబుల నీయఁజాలని మహాభక్తాళి

గాపాడ కా! గ్రహామ్ముఁ జూపఁగనౌనె? తిర్మలపురేంద్రా!
రామచంద్రప్రభూ! ౧౪

మ. శిబి యేమిచ్చె నహల్య యేమిడె గజశ్రేష్ఠుండు పాంచా
లియుఁ। సొబగారీతిని నీ కొసంగిరొకో యేసొమ్మని వాకు
వ్వుమా! విబుధస్తోత్రపరాయణా! తలఁప నీవే కాతు వెల్ల
ప్పుడుఁ। బ్రబలప్రేమను తిర్మలాపురవరేంద్రా! రామ...

మ. పగవా రెవ్వరు లేరు బంధుగులు నెవ్వారేనియుఁ లేరు ని
న్నగునంచుఁ స్మరియించువారె మరినీకాప్తుల్ సుబాంధుల్,
నిజం! బుగ నవ్వారలఁ బ్రోతు వెల్లపుడు నమ్మోక్షంబునుఁ
వారిఁ జే! ర్పగ భావింతువు తిర్మలాపురవరేంద్రా! రామ
చంద్రప్రభూ! ౧౬

మ. రవిసోముల్ భవదీయనేత్రములు, తారల్ రోమకూపంబులౌ
దివిజుల్ నీసరముల్, మహాబ్ధిజలముల్ దీపించు నీరక్తమౌ
వివరింపఁ శిర మాకసంబు, హృదయం బే బ్రహ్మగోళంబు,నీ
కవలోకింపఁగ దిర్మలాపురవరేంద్రా! రామ ...... ౧౭

మ. తిరుశబ్దార్థము శ్రేష్ఠమౌ, మల యనఁ దీర్ఘోన్నతాగంబు నీ
ధరకుం బెట్టనికోటయై సమము లోతైయుండి వైశాల్యమై
సరవిఁ వృక్షలతావళుల్ వెలయుసత్సౌధాములున్ గల్గి సుం
దరమౌనీపురి తిర్మలాపురవరేంద్రా! రామ......... ౧౮

మ. తిరుమంత్రార్థము మోక్షదాయకము సాధింపంగ నెవ్వారి
కిఁ। దరముఁ గామిని నీపురంబునను నీధామంబుసాన్నిధ్య

దు రహి న్నిల్చినవారి కొక్కరికె యెందుర్ లబ్ధమౌగాన నె
త్తతి వర్ణింతురు దీని తిర్మలపురీంద్రా! రామచంద్రప్రభూ! ౧౯

మ. తిరుపత్యద్రియు భద్రశైలమును నెంతే వెల్గు వేదాద్రి య
త్తెఱ గొప్పారెడి మంగళాద్రియును, నోదేవా! నినుం దాల్ప నీ
పురభూమ్యంతరభాగ మద్రి యగుటన్ బుద్ధిం దలంపోసి, య
యీశ్వర! నీ వుండితె యిందు తిర్మలపురీశా! రామ... ౨౦

మ. సురమౌనీంద్రులు చూడఁజాలని మహాసూక్ష్మంబు నీరూప
మౌ దరిసింపంగలవారు కొందఱె సదాత్మ న్నిన్ను ధ్యానించు
నః ప్పరమానందపరీతచిత్తులకు నీభవ్యస్వరూపంబు నే
ర్పరివై చూపెదు తిర్మలాపురవరేంద్రా! రామ ...... ౨౧

శా. పారావారము లేకమై, కులగిరుల్ భంగంబులై, జ్వాల ల
వ్వారిన్ జేయుచు నగ్గి భగ్గుమను దుర్వారంపువేళ, నీ
కారుణ్యామృతవృష్టి సంక్షయము నాగంజాలితో దేవ! ని
న్నారాధింతును తిర్మలాపురవరేంద్రా! రామచంద్రప్రభూ.

శా. నీనామామృతధారమాధురిని, మౌనిస్తోమ మత్యాతమున్
బానార్హంబని క్రోలిసంతసముతోఁ బ్రారబ్ధముల్ వాసె; నా
దీనాలాపము లాలకించి మనుపన్ దిక్కీవె; యీసృష్టికిన్
బ్రాణాధారుఁడ! తిర్మలాపురవరేంద్రా! రామచంద్రప్రభూ.

మ. తెలియంజాలరు నీ ప్రభావచరితల్, దేవాదిదేవుండ! మౌ
నులు దేవాదులు, యక్షకిన్నరులు, నిన్నున్ భక్తియుక్త
స్థితిన్। బలుమారు న్నుతియింప, ముక్తిపథముం బ్రాపింతు
వద్దాని నేర్పలరం గూర్పుము, తిర్మలాపురవిహారా! రామ

మ. కలవారిం గలవారు, పెంపలర సత్కారంబులం జేతు రీ
యిల లేముల్ గలవారిపోషణలకై యేమాత్రముంగూర్ప, రీ
కలుము ల్లేములు నీకృపాభవములై కాలస్వభావాప్తి మా
ర్పలరం జేకుదు, తిర్మలాపురవరేంద్రా! రామ ......౨౧

మ. కరిరాజంతటివాఁడు వారిఁ జొర నక్రం బాతనింబట్టి భీ
కరశౌర్యోద్ధతశక్తి నా మకరితోఁ గయ్యంబు గావించి యే
వెఱవుం గానక కావవే యనుచు నిన్ వేడంగ, వే వచ్చి నే
ర్పరివై కాచితి తిర్మలాపురవరేంద్రా! రామ ......౨౨

మ. తరమే యెవ్వరికైన నీవిభవముం దర్కింప, లక్ష్మీసము
త్కరసంధాన సువస్తుపూరిత కనత్ప్రాసాద కాసారభా
సురమందార వనాగతానిలలసచ్ఛుద్ధాంతసీమన్ రమా
దరశయ్యన్ వెలుఁగొందుతిర్మలపురీంద్రా!రామ ......౨౩

మ. భరమై యొప్పెఁ గుటుంబసాగర, మెదం బ్రాల్మాలికల్
గల్గె నీ। శ్వరసాన్నిధ్యముఁ జేరుదారివెదుకన్ శక్యంబు గా
దయ్యె నో।వరదా! నా ప్రతిబంధముల్ దుడిచి నీ భక్తాళి
లోఁ జేర్చి నే।ర్పరివై కావుము తిర్మలాపురవరేంద్రా! రామ

మ. పవనంబున్ బిగియించి, యింద్రియములన్ బంధించి,-కా
మాదులన్। దవులం జేయక దృక్కుల న్నిలిపి, చైతన్యంబు
డంబాఱగా। భవదీయంబగు రూపు గాంచునరుడే ప్రాజ్ఞుం
డు, ధన్యుండు। నీ,శ్వర! నిన్ బొందును తిర్మలాపురవరేశా!

శా. బాలుం డౌటను మన్ను దింటి వను విభ్రాంతిన్ యశోద
న్నమ్మ నీ। చాలున్ గానక నోరు చూపు మనఁగా సర్వప్ర

పంచంబు నీ| లీలాశక్తిని జూపి తల్లి నట వల్లే నాగ మె
ప్పించితౌ| రా! లక్ష్మీధవ! తిర్మలాపురవరేంద్రా! రామ

మ. పసివాఁ డంచును బాల నీయ, నుసురుల్ వాయించితౌ
పూతనన్| గసితో బండిని నెక్కి ద్రొక్కి మడియంగాఁ
జేసితౌ రక్కసున్| బసమీఱున్ సుడిగాలిదైన యసురున్
బాహాబలప్రౌఢిమన్| మసిగావింపవె తిర్మలాపురవరేంద్రా!

మ. నవమాసంబులు గర్భగోళమున మన్పన్ గర్త యెవ్వాడు,
యీ| భువనశ్రేణికి రక్షకుం డెవడు, పెంపున్ జేయ మా
యింపగా| ధవుఁ డెవ్వాడో, జగంబు లెవ్వని సదా ధ్యానిం
చునో, యట్టి క| ర్తవు నీ వౌదువు తిర్మలాపురవరేంద్రా!

శా. కామక్రోధమదాదిశత్రువుల నీకన్ గెల్వగా లేక, నీ
నోముల్ నోమక, ముష్కరక్రియల నెంతే గాలము౦ బుచ్చి
తిన్| స్వామీ! నీపదభక్తిసక్తమగు స్వాంతంబిచ్చి రక్షింపు
మా! రామా! శ్రీకర! తిర్మలాపురవరేంద్రా! రామ... 33

శా. రాసక్రీడ లొనర్ప గోపవనితల్ రమ్యోక్తులన్ వేడ, న
త్యాసక్తిన్ గొని యన్నిరూపముల నిత్యానందులం జేసితౌ
నీసమాగ్రపగుణప్రభావముల నానే నాకు వర్ణింప? ని
ర్వ్యాసంగుండవు తిర్మలాపురవరేంద్రా! రామ ...... 34

శా. లోకంబుల్ నిను గొల్చుచుండు తగ నీలో లోకముల్
వెల్గు నీ| వేకాంతుండవు సర్వలోకములకున్ వేరొక్క డే
డయ్యా! యే|లోకాధీశులుకూడ నీకరుణకున్ లోనై ప్రవ
ర్తింతురు శౌరి! కారుణ్యపయోధి! తిర్మలపురశ్రీరామ...

శా. బాలత్వంబున జేయుసల్లరికి సైపన్ లేక నీతల్లి నిన్
రోలం గట్టగ దాని నీడ్చి తరునిర్మూలంబు గావించి యా
లోలత్వంబున యక్షులన్ మునిచి కీలుం దెల్పి తార్యాళికో
రా! లీలానర! తిర్మలాపురనరేంద్రా! రామ ...... ౩౬

మ. సురరాజల్గియు రాలవాన గురియన్ సూరుల్ భళీ నాగ
భూధరము న్నికొనగోట నిల్పి పసుసంతానంబు గోపాలు
రన్ గిరిక్రిందన్ వసియింపజేసి యచటన్ గెల్పొందినా
వంట నేర్పరి వన్నింటను తిర్మలాపురవరేంద్రా! రామ

శా. మాయాతీతుఁడ వప్రమేయుఁడవు సన్మాన్యుండ వాద్యుండవీ
మాయామేయజగత్ప్రభుండవు సదా మౌనీంద్రవంద్యుండవై
సాయం బొక్కరు లేకయొక్కఁడనె యీసర్వస్వము న్జేతువా
ద్యా! యే మందును తిర్మలాపురవరేంద్రా! రామచంద్ర

శా. దృశ్యం బయ్యెడువస్తుసంచయము నెంతే లేనికీర్తిన్ సదా
దృశ్యంబై తగు నవ్వి యున్నయటు లెంతేఁ జేసి నీమాయచే
వశ్యంబుం బొనరింతు వెల్లయును; నిన్ వర్ణింపఁగా శక్తుఁడున్
బశ్యత్పాలుఁడె కాఁడు తిర్మలపురీంద్రా! రామ...... ౩౮

శా. నీ సంకీర్తనఁ జేయుచుం బులకితాంగ నిద్రంగ మంగొంచు; రే
ఖా సన్నో తగ నల్లిబిల్లిపదముల్ గూయుంగ సేబాసు మా
కాసుల్ గైకొను మంచు నిచ్చుచు వినం గౌతూహల మ్మొత్తు
దు। ర్వ్యాసంగాత్ములు తిర్మలాపురవరేంద్రా! రామచంద్ర

మ. హరినామాంబుధి నోలలాడని నరుం డత్యాశతోఁ గాశికా
పురినిన్ ద్వారవతి ప్రయాగ మొదలౌపుణ్యస్థలుల్ త్రొక్కి

యా! ధరఁ జాంద్రాయణ మాచరించినను పొందఁ లేదు
మోక్షంబు నేర్పరి యొౘ్చైనను తిర్మలాపురవరేంద్రా! రామ

మ. కలిమాయన్ గనలేక మూఢజను లేకాలంబునం దిల్లు వా
కిలి భార్యన్ మఱి నమ్మి మోహవశులై కీల్బొమ్మల ట్లిద్ధరన్
జలియింతు ర్కలితార్థ కామరతులై స్వర్గంబు మోక్షంబు వా
రల కె ట్లబ్బును? తిర్మలాపురవరేంద్రా! రామ......౪౨

శా. సారాచారవిశారదా! విబుధహృత్సంచార! విశ్వోదరా!
పారవారగభీర! ధీరవర! సద్భక్తవ్రజోద్ధార! స
త్కారుణ్యాబ్ధిసుధాకరా! రఘువరా! కళ్యాణమూర్తీ! హరీ!
రారా కావఁగఁ దిర్మలాపురవరేంద్రా! రామ...... ౪౩

మ. అల సాందీపునియొద్ద విద్దియల నభ్యాసించుకాలంబునన్
గలస్నేహంబున నా కుచేలుని మహాకష్టంబులన్ బాపి లే
ములఁ బోఁజేసిననాఁటి సత్కృపను మున్నుం గావఁ బ్రార్థింతు
ని। ర్మలతేజోమయ! తిర్మలాపురవరేంద్రా! రామచంద్ర

మ. తనవారల్ శిశుపాలభూపతికి నీఁదల్పంగ నారుక్మిణీ
వనితారత్నము నీపయిన్ గలుగు సద్భావంబునన్ విప్రుఁ బం
పిన నద్దానికి మెచ్చి పైకొని రిపుక్ష్మాధీశులం దూల్చి కూ
ర్మినిఁ జేపట్టితి వయ్య! తిర్మలపుర శ్రీరామచంద్రప్రభూ! ౪౫

శా. సత్రాజిత్తు రవిప్రసాదమున శశ్వద్రత్నముం జెంది, లోక
త్రాతన్ దెలియంగలేక నిను దొంగం జేయఁడే? పిమ్మటన్
బుత్రీరత్నము రత్న మీయడె యఘంబుం బాప నోదివ్యచా
రిత్రా! నిత్యపవిత్ర! తిర్మలపుర శ్రీరామ ........౪౬

మ. పదియార్వేలు గలారు పత్ను లనుచున్ వాషోయెదర్గాని,
నీ। పదభక్తాళి యటంచు నెంచరు పశుప్రాయుల్, భవద్గాథ
లన్। విదితం బొప్ప నెఱుంగజాలమి; నహాహా విఖ్యాతచా
రిత్రి! దుర్మదసంపన్నులు తిర్మలాపురవరేంద్రా! రామ ౪౭

శా. క్షీరాంభోనిధివీచికావితతి, లక్ష్మీకాంతతో నిచ్చ లో
కారాధ్యస్థితివాసమున్ జరుపు నీ యా దివ్యరూపంబు నే నే
రీతిన్ గనుగొందుఁ? గన్నుఁగవ కెంతే విందు జేకూర్పుమా!
యారాధించెద! తిర్మలాపురవరేంద్రా! రామ ......౪౮

మ. చవిచూడంబడినట్టిరుచ్యఫలముల్ సంతోష మొప్పారబెం
పవు భక్త్యున్నతి నిచ్చినట్టిశబరిన్ హర్షంబునం గాంచి యా
భువిలోఁ బేర్వెలయన్ బవిత్రనదిగాఁ బుట్టించితౌరా! దయా
ర్ద్రవిలాసాత్మక! తిర్మలాపురవరేంద్రా! రామ......౪౯

మ. మధురంబై యతిరమ్యమై, సురనరుల్ మన్నించు పీయూ
షపున్। విధి సంభావితమై, మహామునినుతిన్ విఖ్యాతిఁ గై
కొన్నదై। వ్యథ మాన్పందగు నీదునామము సదా విజ్ఞుల్
జపింపంగ సు। ప్రథితంబౌ సుధ, తిర్మలాపురవరేంద్రా!

మ. కవితల్నేర్చినవారు, శాస్త్రములనున్ గల్గింపజాల్వారు, స
ర్వవిదుల్ వేదనిధుల్ నిరంతరము నీపద్యంబొ శ్లోకంబొ, త
ల్లవమేకాని పఠింపకున్న యెడఁ గల్గంబోదు మోక్షం; బ
హాహా! రవివంశోద్భవ! తిర్మలాపురవరేంద్రా! రామ ౫౧

శా. శబ్దబ్రహ్మమయుండవై వెలుగు, దీ సర్వప్రపంచంబులో
శబ్దాంతర్గతుఁడైన నిన్నుఁ గన దుస్సాధంబు మాసేందుది

తే॥ శబ్దాతీతుఁడ వైన నిన్ దెలియఁగన్ సాగింత్రు యత్నం
బు, ప్రారబ్ధంబుల్ తెగ తిర్మలాపురవరేంద్రా! రామచంద్ర

మ. పదవిస్వీకరణాశఁ గొందఱు మహాబంధంబులం జిక్కి యా
పదలం జెందుదు; రేల యట్టిపదవుల్? భంగమ్ము రానీని,త్వ
త్పదసేవాగతికన్న వేరుపదవుల్ భావ్యంబులా? తెల్పు దు
ర్మదవిధ్వంసక! తిర్మలాపురవరేంద్రా! రామ ......౨౩

మ. అధిపుండై నహుషుండు స్వర్గమున నేమందెన్ ఫలం బెన్న దు
ష్కథకుం బాత్రుఁడె యయ్యె సర్పమయి తద్గాథల్ వినన్ రాని
దే। యధికారం బది యున్న సద్గుణము లే యద్దాని బ్రోవన్
వలెన్। ప్రథనుండేవలె తిర్మలాపురవరేంద్రా! రామ ౨౪

మ. మునులౌ నల్ల సనందనాదులయెడన్ మూర్ఖత్వముం జూపు
టన్। ఘనులౌ విష్ణువిద్వారరక్షకులు వేగన్ వారిశాపా
హతిన్। దనుజుల్ గారె; మహాత్ములైనబుధులన్ ధర్షింప
నట్లబ్బునా।అనికష్టంబులు, తిర్మలాపురవరేంద్రా! రామ౨౫

శా. ఆఱుంబోవని మేటిశూరులు హిరణ్యాక్షుండు తత్సోదరుం
డేరున్ మమ్ము జయింపలేరనుచు, నెన్నే దుష్టకార్యంబులం
బ్రారంభింప, వరాహమర్త్యహరిరూపా లంది ప్రమందించు దే
వారాధ్యుండవు, తిర్మలాపురవరేంద్రా! రామచంద్ర ౨౬

మ. సరవిన్ రావణకుంభకర్ణదనుజుల్ జన్మించి నీశత్రులై
వఱలన్ శాత్రవకుంభిసింహమనఁగన్ వారిన్ వెసన్ గూల్పగా
నరుఁడై పుట్టివధించి సర్వజనసన్మానంబుఁ గైకొన్న ధీ
ర! రమానాయక! తిర్మలాపురవరేంద్రా! రామ... ౨౭

మ. శిశుపాలుండును దంతవక్త్రుఁడును నీశ్రేష్ఠత్వమూ ద్వంగఁగ
ర్కృశవృత్తిం గొని యెన్నియో చెడుపనుల్ గావింప, వారి
న్నిరం। కుశశౌర్యంబునఁ దున్మ నీజయము నుద్ఘోషించె
లోకాళి సాద్యశముం గంటివి, తిర్మలాపురవరేంద్రా! ౫౮

మ. పలుకం జేసినఁ బల్కుచుంటి నిది నాప్రజ్ఞావిశేషంబు గా
దిల నీశక్తియె కారణం బనఘ! సద్విఖ్యాతుఁడౌ నిన్ మదిన్
దలతు న్గొల్తును బిల్తు నెన్నఁగ తులన్ దండింతు నన్నంటు క
ర్మలు నీయానతి తిర్మలాపురవరేంద్రా! రామచంద్ర ౫౯

మ. కలకాలంబును నిన్నెఱుంగకయె మూర్ఖత్వంబునై నెప్డు నో
తలపం జూచెద నంత్యకాలమున వాతశ్లేష్మముల్ నిండ బా
ధలు జాయాసుతు లేడ్వఁ దోచునొకొ నిన్నుం గొల్చియ
ప్పాప కర్మలఁ బోద్రోయఁగఁ దిర్మలాపురవరేంద్రా! రామ

మ. తెలుగున్ బెచ్చును లేదు భక్తిఁ గొలువన్, దాక్షిణ్యమేలయ్య!
యీశ్వరుఁ డీవాచు మదిం దలంచకయె దేవా! సేతువుం
గట్టు నాత్తెటిఁ జక్రోడముఁ గాంచి మెచ్చవొకొ శుద్ధంబైన
తద్భక్తికిన్। వరదా! ఈశ్వర! తిర్మలాపురవరేంద్రా! ౬౧

మ. కుటిలప్రజ్ఞను సర్వసంపదలు చేకూర్పంగ నేనే వృథా
రటనన్ గాక; పరార్థదారరతులౌ పాపాత్ములం గాలుఁ డా
పెటపెట్లాడెడు నగ్నిగోళకమునన్ భీతిల్లఁ ద్రోయించు, లే
దట సందేహము తిర్మలాపురవరేంద్రా! రామ...... ౬౨

మ. పతిమాటల్ జవదాటకుండఁ, బరులన్ భ్రాతృత్వసంపత్తిసిన్
మతి నూహించుచు, నత్తమామలను సన్మానించుచుం బే

మమై। నతిథిం జూచు సుశీలకున్ యశము రాదా? పుణ్యముం
జేరదా?। యతిలోకస్తుత! తిర్మలాపురవరేంద్రా! రామ ... ౬౩

మ. ధనముం గల్గిన నర్థికోటులను మోదంబందఁ గాపాడుటే
ఘనమౌ, దాన నిహంబునన్ యశము వేగన్ వచ్చు; శుద్ధా
త్మతన్। దనరన్ నిర్మలభక్తి నిన్ను గొలువన్ దక్ష్యంబుగా
ముక్తి నిన్। దనియం జెందును దిర్మలాపురవరేంద్రా! ౬౪

మ. ధనజాయాసుతులీషణాత్రంగుజులౌ, తత్కామమోహాంధులా
అనివైరంబు గలట్టి శత్రువులు; వారల్ జ్ఞానదీపంబు నే
ర్పున నారింతురు; వారినిం దెలిసి, పెంపుంగాంచు నాతండె
ధీ।రసరుం, డార్యుండు, తిర్మలాపురవరేంద్రా! రామ ౬౫

మ. పనులున్ జేయి విధానసంపదలు నిల్వంబోవు, మార్పొందుఁ,
బు। ణ్యావిధుల్ తీర్పఁగ నాలసింపఁదగ; దీప్రాణంబు పోఁబూ
నునాఁ। డవునే పుణ్యమొనర్ప? డప్పిగనున స్థానే నుయిం
ద్రవ్వుటల్? రవివంశ్యాగ్రణీ! తిర్మలాపురవరేంద్రా ౬౬

శా. నీవాడన్నను గావవేడెద సదా నీభక్తుఁడన్ నిక్కమా
నేవాడ స్మరికింప దిక్కొరులు లేరీ ధాత్రి నీకన్న నం
చా వాయుప్రభవాదులే యనిరి, దేవా! కంకణాం బుండె నీ
కావిర్భావమునాఁడె తిర్మలపురీంద్రా! రామచంద్రప్రభూ

మ. కులధర్మంబులు గుంటఁ బెట్టి, పరులన్ గొండాడి, పెన్
మోసపున్। వలలం జిక్కి భరింపరానియిడుమల్ బాధిం
పఁగా నొచ్చి వ్యా। కులచిత్తంబున నేడ్వ నేమి యగునిన్
గోవిందుఁ గీర్తింప ని। ర్మలుఁడై వర్ధిలు, తిర్మలాపురవరేం
ద్రా రామచంద్రప్రభూ! ౬౭

మ. కలము న్బట్టినదాది నేకథలొ యే ఖడ్గాలొ పెక్కింటినిన్
గలుకంగల్గితిగాని, నీకథలు నిన్ గీర్తించు నేవేనియున్
గలముం బట్టియు వ్రాయలే, దెటుల దుష్కర్మాబులం బా
సి నిన్ గలియం జాలెదఁ, దిర్మలాపురవరేంద్రా! రామ

శా. బాలుండౌ ధ్రువుఁ డమ్మచేఁ బరిభవింపంబడ్డవాఁ డౌచు నిన్
లాలిత్యంబగు భక్తిచేఁ గొలువ, లీలావిగ్రహంబైన నీ
మూలంబౌ తొలిరూపుఁ జూపి స్థిరమౌ మోక్షంబుఁ జే
కూర్చితౌ రా! లక్ష్యం బిడి తిర్మలాపురవిహారా! రామ

మ. మతిమంతుండగు పాండవాగ్రజుఁడు సన్మానింపయాగంబులో
మతిలేకా శిశుపాలుఁ డల్గి, బిరుసౌ మాటల్ ప్రయోగింప,
నీ వతిచాతుర్యముతోడఁ జక్రహతుఁ జేయన్ జేరె నీలోన
దుర్మతియై యొప్పియుఁ, దిర్మలాపురవరేంద్రా! రామ

మ. నరనాథోత్తమ! నీకృపామహిమచే నానాసుఖోపేతులై
వటులంగల్గిరి, నీదు పాలనముచే వర్తిల్లుసాకేతపూ
ర్వరవాసుల్; హరి యంద్రుగాక నరుఁడ న్వా రుందురే
నిన్ను శ్రీధర! విష్ణూ! హరీ! తిర్మలాపురవరేంద్రా! రామ

మ. పలుకంజాలదు నాదుజిహ్వ యొరు, దేవత్వంబుఁ జేకూ
ర్చుచున్ దలపంజాలదు నామనం బొరుని, నేత్రంబుల్ క
నం జాల వే బలియుంగాని, త్వదేకభక్తుఁడఁ గృపం బాలించి
యిష్టంబు లర్మిలి సంధింపవె తిర్మలాపురవర శ్రీరామ ౨౩

శా. దాసుం డెప్పుడొనర్చు తప్పు లొకఁడౌ దండంబుతోఁ
బాపి యా యాసం బింత యొసంగ వన్న విబుధవ్యాహార

ముల్ వింటి, నే। నాసంగొంటి; ముదంబుగూర్పఁదగునయ్యా
మ్రొక్కెదే నీకు; నే। దాసుండం జుమీ! తిర్మలాపురవరేంద్రా!

శా. కాసుల్ గూర్పఁగ రామదాసుఁడను నేఁ గాదయ్య, భక్తిం
పవి। త్రాస్యు బేర్పడ దోసె లీయఁ దులసీదాసుఁడనా గా
ను; పాల్। దోసిళ్ళం గడుపోయ ధేనువుల నే గోపాలుఁడం
గాను; నీ। దాసుఁడన్, వినతుఁడఁ దిర్మలపురీంద్రా! రామ

శా. గోపీనాథుఁడు జ్ఞానదేవుఁడును సక్కూబాయియున్ భక్తి
మై। నీపైఁ జిత్తము నిల్పి పాండరిపురి న్నీసేవలన్ జేయఁగన్
బాపంబుల్ హరియించి, వారి దయతోఁ బాలించి యం
త్యాన నీ। ప్రాపుం జూపితివంట! తిర్మలపురీంద్రా! రామ ౭౩

మ. కల రీకం గలివేళఁ గూడను భవద్గాథామృతం బాని సొం
పలరం దేలి తరించినట్టివిబుధుల్ హర్షాఢ్యులా త్యాగరా
జులు గోవిందు, కబీరు ముఖ్యులు; మొదల్ శోధించి చిత్తంబు
వా। రల రక్షించితి తిర్మలాపురవరేంద్రా! రామ... ౭౪

శా. సఖ్యంబుం బొనరించి కొందఱును, దాసత్వంబునం గొంద
ఱున్। ప్రఖ్యాతిం గనుబాంధవంబునను గొంద, ర్నీదాసద్గాథ
కున్। వ్యాఖ్యానంబులుసేసి కొందఱును నీవారైరి, నన్నెట్లు
సా। త్సాఖ్యా! వారలఁ గూర్తు తిర్మలపురీంద్రా! రామ... ౭౫

శా. తారాదేవియు, నందనారు, సుమతుల్, తద్జ్ఞుండు తేవప్ప
జ్ఞః। నా౽రమ్యాత్మక వేంకమాంబ, తిరుమంగాఖ్యుండు
నందాఖ్యయా, నారీరత్నము, మొల్ల విఠ్ఠలుఁడు నిన్భక్తిం
గడుం గొల్చి క। న్నారాముక్తిని తిర్మలాపురవరేంద్రా!

మ. పసమైం బాడిన నిన్ను బాలురును నేడ్వన్మానుదుర్, పాము
లిం। పెసగంగన్ బడగల్ విదిల్చి విను, నెంతే గోవు లత్యార్తి
యే। కసవున్ ముట్టక యాలకించును; వినంగా రాని విం కేవి
నీ। యసమానంబగుగీతి? తిర్మలపురీంద్రా! రామ......౮౦

శా. రా యన్నన్ గలుషంబు లెల్ల బయలై రా, నొక్క మా ర్వెంట
నే।మా యన్నన్ మఱిలోనికిం జొర; నదే మంత్రంబుగా నయ్యె
రా।మా యంచున్ వచియించువారి గల పాపౌఘుల్ వెసం
బాపె ద।య్యా! యార్యస్తుత! తిర్మలాపురవరేంద్రా! రామ

మ. అరయన్ శ్రీపతిమంత్రబీజముల విఖ్యాతంబు రావర్ణ మీ
శ్వరమంత్రంబున మూలబీజమగు మావర్ణంబు; నా రెంటి నే
వరుసం గూరిచి మూల మెగ్గ జపియింపంగల్గి యొంత నే
ర్పరు లావారలు, తిర్మలాపురవరేంద్రా! రామ...... ౮౨

మ. వలువల్ విప్పియు స్నానమాడుటకునై వారిం జొరన్ గోపి
కల్। తలలన్ వంపఁగ వచ్చి చీరె లవలీలం దీసి చెట్టెక్క
వా। రలు ప్రార్థింప నొసంగినాఁడవఁట! తద్రాహస్య మెవ్వా
రికిన్। వలనౌనే తెలియంగ? తిర్మలపురీంద్రా! రామచంద్ర

శా. రాముం డన్నను గృష్ణుఁ డన్న దనుజారాతీ హరే యన్న
సు।త్రామస్తుత్య! పవిత్రభక్తజనసంత్రాణా! కృపాపూర్ణ! నీ
నామశ్రేణియ కాదె; చెప్పుటకు నానారూపముల్ పెక్కులౌ
నామంబుల్ కనుచుందు తిర్మలపురీంద్రా! రామ......౮౪

శా. ఎన్నో నామము లున్నవాఁడవని నే నిచ్ఛావిధిం బిల్తు నో
యన్నా! రూపము లేక పేరెసఁగునయ్యా? వస్తువే లేనిచో

నెన్నండైనను నెట్టిపేరుననుగానీ యెవ్వరుంగాని యే
మన్న న్నవ్వగుంగాదె తిర్మలపురీంద్రా! రామచంద్ర...౮౫

శా. నీమంత్రాక్షరహస్య మా శివుఁడు పత్నీమానసప్రీతిగా
స్వామీ! తెల్పెనుగాని వే రొకరికిన్ శక్యంబె యామూల
ము। న్నీమం బొప్ప వచింప? నాఁడు మొదలు న్నీనామ
మార్యస్తుతం। బై మంత్రంబగుఁ దిర్మలాపురవరేంద్రా! ౮౬

శా. సృష్టింజేయఁగ ధాతవై, మనుపఁగా శ్రీవిష్ణువై, కూల్చి
సం।తుష్టిం జెందఁగ రుద్రమూర్తివయి యెన్నో రూపు లి
ట్లుండి నీ। చేష్టల్ పండితపామరస్తుతములై చెన్నొందఁగా
వెల్గితౌ। స్రష్టృప్రస్తుత! తిర్మలాపురవరేంద్రా! రామ ౮౭

శా. బోయండై మును దారిదోపిడుల పాపమ్ముల్ గూర్చి యా
సక్తితో। నాయిల్లాలు కుమారు లంచు వ్యథఁ గుంద న్నా
రదుం డా భ్రమల్। పాయంజేయ, గవీంద్రుఁ డయ్యెఁగద
యవ్వాల్మీకి, నీసత్కథన్। వ్రాయం గల్గుట తిర్మలాపుర

మ. కలలోఁ గాంచినవస్తుజాల మది మేల్కాంచంగ లేనట్లుగన్
సలిలాంతశ్చరబుద్బుదప్రతిమమౌ సంసారసౌఖ్యాళి, యా
వల వ్యర్థం బొనరించు; నిట్లెఱిగి త్వత్పాదార్చకుండైన ని
ర్మలుఁడే పూజ్యుఁడు, తిర్మలాపురవరేంద్రా! రామ ౮౯

శా. ఈసంసారసముద్రమున్ గడవఁగా శ్రీశా! భవన్నామమే
గాసిం దీర్చెడు నావయై తనరు; నీకారుణ్యదృష్టిన్ గనం
రాసుల్ గాదగు పాపపుంజములు జీర్ణంబై సుఖంబబ్బు పే
రాసల్ మానఁగఁ దిర్మలాపురవరేంద్రా! రామచంద్ర ౯౦

మ. ప్రకటాత్మా! శుకశంతనప్రభవ పారాశర్యకౌంతేయ శౌ
నక,దాల్భ్యాంబుజగర్భపుత్రముఖ నానాభక్తసంఘంబు నీ
సకలస్తవ్యములైన గాథలను పెల్చన్ వెల్లడింజేసి తా
రకలంకాత్మకు లైరి తిర్మలపురీంద్రా! రామచంద్ర!... ౯౧

మ. నరనాథా! సరిలేరు నీకు శరణన్నన్ గావ, నాకంటె నీ
ధరలోఁ బాపియులేఁడు నిశ్చయము, భక్తత్రాణపారీణ! యో
వరదా! సర్వజగజ్జనైకనుత! సర్వవ్యాపకా! దానవీ
ర! రసజ్ఞోత్తమ! తిర్మలాపురవరేంద్రా! రామచంద్ర... ౯౨

మ. త్రివిధంబుల్ గుణముల్, త్రిమూర్తులయి వర్తిల్లెం జుడీ
యంచు స।త్కవులుం బాడితు లందుౕ; తత్త్వము నెఱుంగం
జిత్తమాసించు, భ।క్తవితానేష్టద! మామకేష్టమగు నద్దా
నిం దయంఁజూపు న।న్నవమానింపక తిర్మలాపురవరేంద్రా!

మ రవి యొక్కండె యనేకభాండములలో రాజద్గతిం దోచు
చున్ ।దివినిన్ వెల్గెడురీతి, నీ వొకడవే దేవుండవై యుండి కా
ర్యవిధుల్ దీర్పఁగ, నెన్నొ రూపముల నర్చల్ గొందు,
నీశక్తి మా। నవదుర్గ్రాహము, తిర్మలాపురవరేంద్రా! రామ.

మ. తెలియం గల్గుట నిన్ వసిష్ఠముఖులౌ దివ్యర్షు లాకాశమం
డలమందుం, జిరకాల వాసులయి యున్నారయ్యా! యీ
నాఁటికిన్। దలమే నిం దెలియంగ మాదృశులు? కే దారిన్
భవం బార్చి ని। ర్మలునిం జేసెదొ, తిర్మలాపురవరేంద్రా!

శా. స్థూలంబౌ తను వసిరంబు, తగ నందుం గల్గుజీవుండె కా
మూలాధారుఁడు దేవుఁ; డిట్లెఱుఁగుటే మోక్షంబు; యాగో

ప్య మే। కాలంబాను వివేకశాలి తెలియంగా నేర్చు సద్యోగియై
క్రాలంగల్గినఁ దిర్మలాపురవరేంద్రా! రామ.........౯౬

మ. అరయం గుండ లనేకరూపముల చేయంగల్గు మన్నో
క్కరై। వఱలున్, స్వర్ణ మనేకభూషణములై వర్తించు,
క్షీరంబు లో। క్కరకం బొప్పును గోవు లెన్ని యయినన్,
గాయంబులన్ జీవుఁ డ। ట్లరుసం బొప్పఁగ నుండుఁ దిర్మల
పురీంద్రా! రామచంద్రప్రభూ! ౯౭

మ. రఘురామా! యినవంశసోమ! విలసద్రాజన్యకంఠీరవా!
మఘసంరక్షణ! దుష్టశిక్షణ! లసన్మౌనీంద్రసంపోషణా!
మఘవాద్యర్చితపాదపద్మయుగళా! మాన్యద్యశఃకారిశౌ
ర్యఘనా! సద్గుణ! తిర్మలాపురవరేంద్రా! రామచంద్రప్రభూ!

మ. కరుణావార్నిధి! భక్తపద్మమిహిరా! కాకుత్స్థవంశోద్భవా!
పరమా! యాదవవంశపావన! సుధీవారస్తుతాచార! భీ
కరనానావిధపాపసర్పగరుడా! కల్పాంతసంవాస! యీ
శ్వర! సత్యప్రియ! తిర్మలాపురనివాసా! రామ......౯౯

మ. మడుగుంజొచ్చినసర్వభూతములనున్ మ్రందించుకాళింగు
పైఁబడి, చాఁద్రొక్కి, తదీయపత్నులు కడుం బ్రార్థింపరక్షిం
చి, యయ్యడుగుల్ సర్పఫణంబులందుఁ గనిపింపంజేసి, విన్నా
ణిపే। ర్వడయం గల్గితివౌర! తిర్మలపురీంద్రా! రామ ౧౦౦

శా. లోకారాధ్యుఁడవయ్యు, యాదవులబాలుండన్న పేరంది,
యాలోకద్రోహినిఁ గంసుఁ గూలిచి, సుధీలోకంబు కీర్తింపఁగా
వీకం దల్లియుఁ దండ్రి పొందుచెఱనున్ విడ్పించి పెన్మోద
పున్। మ్రాకుంబెంచిన తిర్మలాపురవరేంద్రా! రామ ౧౦౧

శా. కౌసల్యాశుభనామ, పంక్తిరథభూకాంతుండు, తత్పట్టణం
బౌసాకేతము, తత్పురీప్రజలు, నే యత్యంతపుణ్యప్రదం
బౌసత్కార్యము చేసిరో? భవదమేయాకారముల్ నిత్యమున్
వాసిం గానఁగఁ దిర్మలాపురవరేంద్రా! రామచంద్రప్రభూ

మ. పలుకన్ గానఁగఁ గొల్వ నాజ్ఞలుగొనన్, వాతాత్మజాగోక్
ద్భవా! దులు నా వైశ్రవణుండు, పూర్వభవమందుం జేయు
పుణ్యంబుతో! దులయా నొక్క సహస్రయజ్ఞములు? భక్తు
న్నీవు ప్రేమింపగా! నలఘుస్వాంతుఁడ! తిర్మలాపురవరేంద్రా!

మ. కల వన్నింటను నీవు, లేని దొకటం గానంగరా దెందు; ని
శ్చలభక్తిన్ దనుజార్భకుండు నిను నెంచన్ స్తంభమం దప్పుడే
తెలియం బుట్టవె, దానవాధిపుని నొతే ద్రుంపవే బాలు
ని! ర్మలచిత్తుం గరుణింపఁ దిర్మలపురీంద్రా! రామ...౧౦౮

మ. తులసీపత్ర మదెంత పుణ్యయుతమో? తోరంపుఁదోమా
లగా! వెలయు న్నీ మెడలోఁ బవిత్రమగు భావంబందుఁ బుణ్యాం
గనల్, కల కాలంబు స్మరింపఁ దద్విమలమాంగల్యంబు వృద్ధిం
గనన్! జలుపంజాలెదుఁ, దిర్మలాపురవరేంద్రా! రామ ౧౦౯

మ. కురువంశంబు నశించె నంచు మదిలోఁ గ్రోధంబు పెల్లుబ్బఁగన్
గురుపుత్రుం డిలలో నపాండవము జేకూర్పంగఁ బూనంగ న
క్కరణిన్ మాన్పఁగ, నుత్తరాతనయునిన్ గర్భస్థుఁడౌ వాని నే
ర్పరివై కాచితి, తిర్మలాపురవరేంద్రా! రామచంద్రప్రభూ!

శా. దుర్యోగంబున ధార్తరాష్ట్రు లధికద్రోహంబు కౌంతే
యభూ! వర్యోత్తంసులకున్ బొనర్పఁగను దేవా! పాండవార్థం

బుగా౹ నిర్యాణం బొనరించి కౌరవుల, నెంతేఁ గీర్తిఁ గైకొంటి
వం౹ చార్యుల్ వ్రాసిరి తిర్మలాపురవరేంద్రా! రామ ౧౦౭

మ. త్రిదశాధీశ్వరమానిరాజహితవర్తీ! ఘోరదైతేయభీ
ప్రదశౌర్యోజ్జ్వలమూర్తి! సర్వజగతీరాజ్యేందిరాసమ్మదా
స్పదసర్వేశ్వరలాంఛనాయుతయుతాద్వంద్వైకసత్కీర్తి!పూ
ర్ణదయావిశ్రుతమూర్తి! తిర్మలపురీంద్రా! రామచంద్రప్రభూ!



# శ్రీరామచంద్ర స్తుతిఋతుమాల

— బాలకాండ —

సీ. శ్రీమదయోధ్యాపురీవరప్రభుఁడైన
దశరథుసుతుఁడవై తనరినావు
కౌశికయాగరక్షణదీక్ష వహియించి
వనిఁ దాటగాములఁ దునిమినావు
గౌతమకోపాగ్నిఁ గఠినశిలాకృతి
గాంచునహల్యను గాచినావు
శివధనుర్భంగంబుఁ జేసి వైదేహిని
బరిణయంబై కీర్తిఁ బరగినావు
భార్గవుని గెల్చి పురిదారి బట్టి తిరుమ
లాపురముఁ జేరి భక్తులపాపములను
బాపినాఁడవు శ్రితలోకబాంధవుఁడవు
చారుతరకీర్తి! శ్రీరామచంద్రమూర్తి!

—♦ అయోధ్యాకాండము ♦—

సీ. రాజీవనయనుఁడౌ రాముఁ డేలఁగఁదగు
నని పట్టభద్రుఁ జేయఁగఁదలంచు
జనవిభునిం జూచి సతి కైక పదునాల్గు
వత్సరాల్ రాముని వనికి నంపి
తనసూనుఁడౌ భరతుని రాజుగా జేయు
మనికోర దశరథుఁ డలుక బూన
విని యది, సౌమిత్రి, జనకజ వెంటరా
మునివేషధారివై పురము బయలు
దేరి చనుచుండఁ బౌరులు గోరఁ దిరుమ
లాపురముఁ జేరి భక్తులపాపములను
బాపినాఁడవు శ్రితలోక బాంధవుఁడవు
చారుతరకీర్తి! శ్రీరామచంద్రమూర్తి!

—♦ అరణ్యకాండ ♦—

సీ. నీశౌర్యగాంభీర్యనిర్మలకీర్తులు
విని దశకంఠుఁడు కినుకఁ బూని
వనవాసులౌ మిమ్ము వంచింపఁ దా నెంచి
మామయౌ మారీచుమాయవలనఁ
బసిఁడిలేడిని బాపఁ బత్ని దానిని గోరఁ
బట్టి తెచ్చుట కీవు బయలుదేర
ఎడబాటు గాంచి యిలతనూజను ముచ్చు
లాగు రావణుఁడు తా లంకఁ జేర్ప
నాతిజాడల నరయుచు నడచి తిరుమ
లాపురముఁ జేరి భక్తులపాపములను

బాపినాఁడవు శ్రితలోకబాంధవుఁడవు
చారుతరకీర్తి! శ్రీరామచంద్రమూర్తి!

—♦ కిష్కింధకాండ ♦—

సీ. సంపాతిచే సీతజాడ కొంత యెఱింగి
చనుచుండ గిష్కింధయను పురమున
వాలిసుగ్రీవులు వనచరుల్ సోదరుల్
ఘోరుచో నంజనీపుత్రుకతన
రవిజు స్నేహించి యరాతి వాలి నడంచి
యాంజనేయునిభక్తి యరసి మెచ్చి
లవణాబ్ధి లంఘించి లంకాపురినిఁ జొచ్చి
సీతకు నీవార్తఁ జెప్పఁ బంపి
ఆనవా లిచ్చి యాజాడ నరయఁ దిరుమ
లాపురము జేరి భక్తులపాపములను
బాపినాఁడవు శ్రితలోకబాంధవుఁడవు
చారుతరకీర్తి! శ్రీరామచంద్రమూర్తి!

—♦ సుందరకాండ ♦—

సీ. త్వన్నామమును తారకంబు ధ్యానించి పవనజుఁ
డబ్ధి దాటియు లంకయందు జొచ్చి
రావణప్రాసాదరాజముల్ పరికించి
యుద్యానమున సీతయున్కిఁ గాంచి
అంగుళీయక మిచ్చి యానవాల్ గైకొని
వనమెల్ల బెఱికి రావణునిఁ జేరి

భాషించి కొంత యాపత్తు లంకకుఁ గూర్చి
మరలి నిట్ల జేరి సీతరుణివార్త
దెల్ప నానందవారాశి దేలఁ దిరుమ
లాపురము జేరి భక్తులపాపములను
బాపినాఁడవు శ్రితలోకబాంధవుఁడవు
చారుతరకీర్తి! శ్రీరామచంద్రమూర్తి!

— యుద్ధకాండ —

సీ. వనచరకోటితో వారిధి బంధించి
శరణన్న యలవిభీషణునిఁ గాచి
దశకంఠుపురము నుద్ధతిఁ జేరి చెలరేగి
యింద్రజిదాదుల నింద్రపురికిఁ
బంపి దశగ్రీవుఁ బరిమార్చి తత్సోద
రునకు లంకారాజ్యమును నొసంగి
సురముఖు లెన్నగా ధరణీజఁ గొని పుష్ప
కం బెక్కి నిఖిలజగంబు మెచ్చ

వడి నయోధ్యకుఁ జనుత్రోవనడుమఁ దిరుమ
లాపురముఁ జేరి భక్తులపాపములను
బాపినాఁడవు శ్రితలోకబాంధవుఁడవు
చారుతరకీర్తి! శ్రీరామచంద్రమూర్తి!

# శ్రీమదాంజనేయ స్తుతిపద్యపంచరత్నములు

శా. శ్రీరామోత్తమమంత్రరాజ మెదలోఁ జింతించు భక్తాళికే
గోరంబుల్ దరిఁజేరకుండ సుఖముల్ గూర్పంగ భావింతు వె
వ్వారైన న్నరిగారు నీకుఁ గరుణావారాశి వౌ దీవు;ని
న్నారాధించెదఁ దిర్మలాపురవరేశా! శ్రీమరున్నందనా!

శా. పారావారమునుర్వ జవోన్నతిఁ దృణప్రాయంబుగాదాటిదే
వారాతుల్ దిగులొంది బెగ్గిలఁగ నార్పఁ రానికోపాగ్ని పెం
పారఁ లంకిణిఁ గూల్చి కాల్చి,దనుజప్రాసాదముల్, వేడ్కసీ
తారామామణి గన్నతిర్మలపురీధామా! మరున్నందనా!

శా. భూతప్రేతపిశాచరాక్షసకృతంబుల్ కష్టముల్ తూల్చి .లో
కాతీతస్థితి భక్తవర్యులు ముదం బందం జనిం గంటి వౌ
నీతత్త్వంబు నెఱుంగబల్కవశమే నిర్ద్వంద్వ తేజోనిధీ!
ఖ్యాతప్రీతినిఁ బ్రోవు తిర్మలపురీశా! శ్రీమరున్నందనా!

మ. అరుణాంభోరుహలోచనద్వయము శౌర్యాటోపముం దె
ల్పు నీ కరుణాపూరవరాననంబునుజగత్కల్యాణకారిక్రియల్
సరసాలాపము దెల్పు శాంతి నివి యాశ్చర్యంబుఁ గావింపవే
స్మరియింతు న్మదిఁ దిర్మలాపురవరేశా! శ్రీమరున్నందనా!

మ. కనుపర్త్యన్వయవార్ధిచంద్రుఁడు గుణగ్రాహ్యుండు లక్ష్మీనృ
సింహునికోర్కెఁ దగపంచరత్నముల, నత్యుత్సాహినై
కూర్చి తో। నన; గోపాలుని పూరుషోత్తముఁడ నయ్యా!
రామదూతా! నమోస్తని యర్పింతును కావు తిర్మలపురీ
శా! శ్రీమరున్నందనా!

# ఫ ల శ్రు తి

మ. రవిసోమాదినవగ్రహంబులును, తారల్, వ్యోమభాగంబులున్
భువియున్ వార్ధులు, సప్తశైలములు, దిక్పాగంబునుం, గల్గు
దా।క వరంబై భవదాలయంబు నిలుచుంగా, కీవు సమ్యక్కృ
పా। బవలున్ రేయును బ్రోవ, దిర్మలపురీంద్రా! రామ

మ. వినుతాత్రేయలనిరోగివిప్రుండ, యజుర్వేమండ మౌద్గల్యగో
త్రనరోత్తంసుఁడు వేంకటయార్యునకుఁ గాంతామాన్య కోటాం
బకున్ దనయుండం, బురుషోత్తమాహ్వయుఁడ, నన్నా! య
జ్ఞ నిద్దాని జేసినవాడం; గనుపర్తిమాన్నృహరి వాసిం గోర
రామప్రభూ!

మ. శతకంబిద్ది రచించె దిక్కర మహైశ్వర్యేందు సఙ్జన్ జగ
న్నుతమై యొప్పిన శాలివాహశకమందున్ ధాతృసంవత్సరా
న్వితమాజ్యేష్ఠపుఁ గృష్ణపక్షమున నెంతేయున్న యేకాదశిన్
మతి నీపైనిడి తిర్మలాపురవరేంద్రా! రామచంద్రప్రభూ!

మ. శ్రితకల్పా! కనుపర్తి నర్సయను లక్ష్మీనర్సు వీరాఖ్యుఁడున్
బ్రతిభావంతుఁడు సుబ్బరాయఁడును గుర్రాజుం గుమారుల్
మహా।మతి వీరార్య కుమారుఁడైన నరసింహంబిద్ది వ్రాయిం
చి,న। న్నతిభక్తిం బలికించెఁ దిర్మలపురీంద్రా! రామచంద్ర

సీ. షట్సహస్రాన్వయ జలజాతవనసూర్యుఁ
డైనకన్పర్తి లక్ష్మీనృసింహ
తదజ్ఞుఁ జాంగీరసాబ్దమున ఫాల్గుణశుద్ధ
నవమిని భానుదినంబునందు

మృగశీర్షతారతో మెఱయుమత్స్యపురాశిఁ
బుష్కరసుముహూర్తమునను భక్తిఁ
తిర్మలాపురమున దివ్యమందిరమున
నవనిజ సౌమిత్రి నాంజనేయు
భోగసుందరరామవిస్ఫురితనాము
నిన్ను ఫణికులనాథు బేరెన్నఁ దగిన
గోపురం బష్టదిక్పాలకులు వెలయఁగ
మించునాలయమున బ్రతిష్ఠించె మఱియు.

సీ. వెలయు ఘంటానీకములతో ధ్వజంబును
రథముఁ బ్రాకారంబు రమ్యములగు
మండపంబులుఁ గేళిమందిరంబులును ద
త్తత్ప్రదేశముల నుత్తమతఁ గూర్చి
పరఁగ సీతారామపురమును నిర్మించె
బాటసారులకు నాప్యాయనముగ
నీరూరు నూయి జంగారెడ్డిగూడెంబు
కొవ్వూరు బయ్యనగూడెములకు
వెడలు రోడ్డున సీతమ్మపేట కింత
దాపునను గూర్చె నెల్లర తనివి దీఱ
మంచికార్యంబు లెన్నొ చేయించె నధిపు
లాదరంబునఁ గనఁగఁ దా నలరుచుండె.

సీ. లోకకళ్యాణంబు చేకూర్చు నీకు క
ళ్యాణోత్సవంబు ప్రత్యబ్దమందు
చైత్రశుద్ధంబున సద్భక్తి నవమినిఁ
దాల్మితో నన్నస న్తర్పణములు

ప్రకటితంబుగఁ జేసి బహుదానము లొనర్చు
నీకు సద్భక్తుండు నిశ్చలుండు
నా కాప్తమాళి బాంధవుఁడు నీచరితంబు
వచియింపు మని నన్ను వాంఛ జేయ

నీ పదాంభోజములఁ గొల్వ నీరజాక్ష!
మదిని నుత్సాహమొదవ సంపదలు గలుగ
జేసి మోక్షం బొసంగ ప్రసిద్ధుఁడ వని
నమ్మి వ్రాసితి నీకథల్ నరవరేణ్య!

సీ. ధాతృసంవత్సరోత్తమమాసమా జ్యేష్ఠ
మున శుక్లపక్షంబునను దశమిని
మందవాసరమున మారుతిస్తుతిపద్య
ములను నీ ఋతుమాలఁ బలికినాఁడ
విని మెచ్చి తత్ఫలం బనఁగ లక్ష్మీనృసిం
హాఖ్యున కిమ్ము దీర్ఘాయురధిక
భోగభాగ్యంబులు పుత్రపౌత్రాదిసం
పద లింతకన్న హెచ్చుదన మంద

అనఘ! గోపాల్ని పురుషోత్తమాభిధాన
యాజినగు నేను ప్రార్థింతు నలరుభక్తిఁ
దిర్మలాపురసంవాస! దివ్యహాస!
భోగసుందరరామవిభో! మహాత్మ!



ఉ. సారవివేకవర్తనల సన్నుతి కెక్కిన వారిలోపలం, జేరినయంత మూఢులకుఁ జేపడ దానడ యెట్టు లన్నఁగా, సారము లోన హంసములసంగతి నుండెడికొంగ పిట్టకే, తీయనఁ గల్గనేర్చునె తదీయగతుల్ దలపోయ... ౧౦౦

ఉ. స్థానము తప్పివచ్చునెడఁ దా నెటువంటిబలాఢ్యుఁడున్ నిజ, స్థానికుఁడైనయల్పునికతంబున నైనను మోసపోవుఁగా, కానలలోపల న్వెడలి గంధగజం బొకనాఁడు నీటిలోఁ, గానకచొచ్చినన్ మొసలికాటుకు లోఁబడదోటు... ౧౦౧

చ. సిరిగలవాని కెయ్యెడలఁ జేసినమేలది నిష్ఫలం బగున్, నెఱిగుఱి గాదు వేదలకు నేర్పునఁ జేసిన సత్ఫలం బగున్, వఱ

పున వచ్చి మేఘుఁ డొకవర్షము వాడినచేల
మీఁదటం, గురిసినఁగాక యంబుధులఁ గు
ర్వ్వఁగ నేమిఫలంబు... ౧౦౨

చ. సిరి వలెనేని సింహగుహచెంత వసిం
చినఁ జాలు సింహముల్, కరులవధింపఁగా
నచటఁ గల్గును దంతచయంబు ముత్యము
ల్, హరువుగ నక్క బొక్కకడ నాశ్రయ
మందిన నేమి గల్గెడుం, గొరిసెలుదూడ
తోఁకలును గొమ్ములు నెమ్ములుఁగాక...

చ. స్థిరతరధర్మవర్తనఁ బ్రసిద్ధికి నెక్కి
నవాని నొక్కము, ష్కరుఁ డతినీచవాక్య
ములఁ గావనిపల్కిన నమ్మహాత్ముఁడుం, గొ
ఱఁతవహింపఁడయ్యెడ నకుంఠితపూర్ణసుధా
పయోధిలో, నరుగుచుఁ గాకి రెట్ట యిడి
నందున నేమికొఱంత... ౧౦౪

చ. సిరిగలనాఁడు లభ్య మగు చిత్తము
నందుఁ దలంచినంతనే, నరులకు నెట్టికార్య
మయినఁ జతకాదు బహు ప్రయత్నము
ల్, జరిపిననైన లేమియెడ సత్యము సుమ్మిది
'చేతి కందుఁ బం, డరయఁగ దోఁటికందదు
గదా' యనుసామ్యముపోలె... ౧౦౫

చ. స్ఫురతర కీర్తిమంతు లగుపుత్త్రులఁ
గాంచినఁగాక మూఢము, పర్తరులఁ గనం
గఁ దేజములు గల్గవుగా మణికీలితాంగుళా,
భరణము లంగుళంబుల శుభస్థితిఁ బెట్టినఁ
గాక గాజుటుం, గరములు పెట్టినందున వి
కాసము గల్గునటయ్య... ౧౦౬

ఉ. సేనగ వాంఛితాన్నము భుజింపఁ గ
లప్పుడు గాక లేనిచో, మేనులు దస్సియుం
ట నిజమే కద దేహుల కగ్ని హోత్త్రుఁ డౌ,

నే నిజభోజ్యముల్ గుడుచు నేనియుఁ బుష్టి
వహించు లేనినాఁ, డూని విభూతిలో నడఁ
గియుండఁడె తేజము దప్పి… ౧౦౭

ఉ. హాళినిఁ బుట్టుబుద్ధి తిరమైనవిధంబు
నఁ బెట్టుబుద్ధులా, వేళల కంతే కాని మఱి
వేన్కకు నిల్వవు హేమకాంతి యె,న్నాళ్ల
కుండుఁగాని యొకనాఁడు పదంపడి సానఁ
బట్టినన్, దాళుకయుండనే యినుపతాట
కుఁ జాయలు పోక… ౧౦౮

ఉ. హీనకులంబునందు జనియించినవారి
కి సద్గుణంబు లె, న్నేనియుఁ గల్గియున్న
నొకనేరము చెందకపోదు పద్మముల్, భూ
నుతిఁ గాంచియుం బురదఁ బుట్టుటవల్లసు
ధాకరోదయం, బైన నసహ్యమొందవె ప్రి
యంబునఁ జూడఁగ లేక… ౧౦౯

ఉ. ఇంచుక నేర్పు చాలక విహీనతఁ జెం
దిననాకవిత్వముల్, మించు వహించె నీకతన
మిక్కిలి యెట్లనఁ దోలుబొమ్మలల్, మంచి
వివేకి వానితెరమాటున నుండి ప్రశస్తరీతి
నా, డించినవాడవే జనులడెందము నింప
వె ప్రీతి భాస్కరా. ౧౧౦

భాస్కరశతకము సంపూర్ణము.



చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము:—1925.